# పైడి రాజు

## —నాటిక—






ఆర్.వి.యస్. రామస్వామి

అరుణా పబ్లిషింగ్ హౌస్
గాంధీనగరం
విజయవాడ-3



శ్రీ దామెర సూర్యనారాయణస్వామిగారు
(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ  మాజీ కార్యదర్శి.)

నాలాంటి వారెందరికో చేయూతనిచ్చి కాళ్ళమీద నిలబెట్టిన ఉదార హృదయులు — ఆరోగ్యానికి హాస్యం అవసరం అంటూ చలోక్తులు విసిరే రసజ్ఞులు అయిన మా సూర్యనారాయణస్వామి బాబాయిగార్కి- ఈ నాటికను అంకితం చేస్తున్నాను.

—ర చ యి త.

విజయవాడలో ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక సభలు వారు నిర్వహించిన పోటీలలో ఉత్తమ ప్రదర్శన బహుమతి, విజయనగరం విజయరామ కళాపరిషత్తు పోటీలలో ద్వితీయ ఉత్తమ ప్రదర్శనకు, ద్వితీయ ఉత్తమ నటుడు (పైడిరాజు) బహుమతులు పొందిన కళారాధన నటీ నటవర్గం.

| | | |
|---|---|---|
| పైడిరాజు | — | వరప్రసాద్ |
| శీనయ్య | — | B. నారాయణ |
| అనంతం | — | కృష్ణ |
| పకీరు | — | శ్రీనివాసమూర్తి |
| నాగన్న | — | శ్రీరంగం శ్రీధరాచార్య |
| పోలీసు | — | రామస్వామి |
| నాగరత్నం | — | కుమారి రత్న |

| | | |
|---|---|---|
| సంగీతం | — | బాబ్జి |
| దర్శకత్వం | — | భానుప్రకాష్. |

# పైడిరాజు

పంచాయితీ బోర్డు కార్యాలయం. కావలసిన అలంకరణాలన్నీ ఉంటాయి. కుడి, ఎడమలకు రెండు ద్వారాలు. మధ్యలో ఒక ద్వారం ఉంటాయి.

లైటిల్సు వినిపిస్తూ వుంటాయి. పైడిరాజు కొబ్బరికాయ దేముడి విగ్రహం ముందు కొట్టి, వచ్చి కుర్చీలో కూర్చుని సంతకాలు చేస్తుంటాడు. శీనయ్య మరో కట్ట కాగితాలు తెస్తాడు. పైడిరాజు సంతకాలు చెయ్యానని మొరాయిస్తాడు. కావాలంటే వేలుముద్రలు వేస్తానంటాడు. శీనయ్య బ్రతిమాలి సంతకాలు చేయిస్తూంటాడు. నాగన్న సోడాలతో వచ్చి ప్రెసిడెంటుగారిక్కి ఒక సోడా కొడతాడు. నాగన్నకు సౌంజ్ఞ చేసి శీనయ్య బయటకు వెళతాడు. ప్రెసిడెంటు చుట్ట వెలిగించి గది మూలమూలలన్నీ తిప్పుతాడు నాగన్న.

పై : చస్....ఇంక నా వల్ల గాదెహే

నా : అమ్మమ్మ అలా అనకండి మరి. ఇంకా ఆ గమండీ పోనాది.

పై : ఆ గదట్టుకెల్లి గంగలో కలుపు. అలవాటులేని చుట్టా కటి తగిలించావు. అయిదు నిమసాలనుంచి అంతూ పొంతూ లేకుండా ఏకబిగిని తప్పెత్తన్నావు. పంచా యితీ బోర్డు పెసిరెంటనుకొన్నావా మజాకా.

నా : మరా పెసిరెంటుగారలా తిరిగేవోరండి.

పై : ఓ ర్రేట్రా కూశావు నేనుండగా ఆడెవరంట పెసిరెంటు

నా : ఆరు సెలవు మీాదెల్లినాకే గదండి మీారు....

పై : సెటపొ్పెసె నువ్వు.... మల్లా ఆ మాటంటే తవ్వి పాతేత్తాను ఆడొచ్చినా నేనేరా పెసిరెంటు.

నా : అది కుదరదులెండి.

పై : ఏటన్నావు మల్లా అను ఆ మాట. పైడిరాజు మాటంటే తిరుగు లేదు ఎరికేనా? ఒరోరేయ్ డబ్బులా వర్సలా కురిపించేత్తాను.

నా : రామరాజుగారంటే పెజలకి గురండి. అందుకే ఆరు పెసిరెంటయ్యారు.

పై : నా డబ్బన్నా పెజలకి గురేరా....అందుకే పెసిరెంటు కుర్చీ నాపాలబడింది. (పెసిరెంటు కుర్చీలో కూర్చుంటాడు) కాదనోడ్డి:. ఎదరకొచ్చి నిలబడమను. (నాగన్న ముందుకొస్తాడు) వంద పారేసి నాలిక సీరిపించేత్తాను.

నా : ఆ మాటన్నాక నాకేటి పట్టిందిలెండి. పదండి మరా గదుండి పోనాది.

పై : ఇంక నావల్ల కాదని సెప్పానా.

నా : రామరాజుగారలా తిరిగేవోరండి. ఆ మూలనుంచీ ఈ మూలకి, ఈ మూలనుంచా మూలకి తిరిగి తేగానీ కుర్చీలో కూకోనేవోరేకాదు.

పై : కుక్కేదన్నా కరిసిందేమో ఆడ్ని. లేకపోతే తలతో గుమ్మానికి గుద్దేసుంటాడు. ఆడి తిరిగేవోడని నన్ను తిరగమంటావేటి. మతోయిందేటి.

నా : అది కాదండి. ఆ పెసిరెంటుగారలా తిరిగేవోరని ఊరంతా ముక్కుమీద ఏలేసుకునే వోరండి.

పై : ఈ పెసిరెంటుగారలా తిరగసన్నారనీ సెప్పి, కావాలంటే ముక్కుతీసి ఏలుమీదేసుకోమను. (నాగన్న ఏదో మాట్లాడబోతాడు) అదంతే. మల్లా మాట్లాడావంటే నీ ముక్కుచూసుకో. (నాగన్న ఏదో గొణుగుతాడు) సెటప్పాసే నువ్వు. సెటప్పంటే నోరు మూసెయ్యి అంతేమరి. అగరొత్తులు కట్టొకటి ఎలిగించి బల్లమీదెట్టు సుట్టోసన కడుపులో గిరన తిప్పేత్తంది.

(నాగన్న అగరొత్తులు వెలిగించి బల్లమీద పెడతాడు. పైడిరాజు వేళ్ళు విరుస్తుంటాడు. "అహో, ఓహో" అంటూ పలికి, పైడిరాజు చూపుడువేలు పట్టుకునేసరికి కస్సుమంటాడు.)

పై : పీతమొకం ఎదవని.... ఈ ఏలేరా సంతకాలతో సచ్చుబడిపోయింది..... ఈయేలనుంచి సీకు అయిదు రూపాయలు కోసేశాను. ఒరొరే యే ఆ శీనయ్యగాడొస్తే

ఇంక సంతకాలు గీకనన్నానని సెప్పు. ఆ పెసిరెం ట్టేవోడని ఏలడిపోయిందాక గీకించాడు. ఓరో రేయ్ ఈ వారంలో రాసిన రాతగాని నాసిన్న ప్పుడు రాసుంటే పది బి. ఏలు ఏకబిగిని పాసెయ్యో వోడ్ని.

నా : సిత్తం. నిన్నా మొన్నా ఊరంతా అదే కూతండి.

పై : ఏటా కూత ;

నా : బి.ఏ చిదివినోళ్ళు తమ ముందు బలాదూరంట. తమరీ ఊరు పెసిరెంటు కావటం ఆళ్ళ అదుట్టమంట.

పై : (నవ్వి) ఈ సుట్ట ముక్కట్టుకుపో.

నా : మా సిన్నోడి మాటిన్నారా ?

పై : ఏటంటాడేటి ?

నా : పెతి ఏడు కొత్త అమాసకొచ్చే గాలీవోన ఈఏడు మీరు పెసిరెంటయ్యారని రానేదటండి.

పై : (బాగా నవ్వి) ఎదవ. ఎదవని ఆడొయస్సెంతరా ?

నా : ఎంత లేదన్నా.... పెద్ద కరువొచ్చింది చూడండి అప్పుడు పుట్టాడండి....పదుండవండి.

పై : ఉంటాయుంటాయి. కరువులో పుట్టాడుకాదు పదుం టాయి. ఇదిగో ఈ పది అట్టుకుపోయి ఆడికి లాగూ చొక్కా కుట్టించు. (పదిరూపాయల నోటిస్తాడు)

నా : (వెళ్ళబోయి) టవుటుపంట్లాం టవుటుపంట్లాం మని కొరుక్కు తినేత్తన్నాడండి.

పై : టపుటుపంట్లామా ! పెరిగే వయస్సులో ఆ గోట్టాం గుడ్డ లెందుకెహే. ఒల్లు గిడసబారిపోద్ది. ఆనోళ్ళు నంగాలు కుట్టిత్తారుసూడు ఆలా నాజూగ్గా కుట్టిం చెయ్..... ఆ పది నేనే యిచ్చానని చెప్పు ఆడితోని.

(నాగరత్నం ప్రవేశించి పదిరూపాయల నోటుచూచి గుండె బాదుకొంటుంది)

పై : (భయంతో) రత్తంవా....కొత్తమాస.... గాలీవాన .... పెద్దకరువు....పదిరూపాయలు

నాగ: అమాసలేదు - గాలీవానలేదు - రెండు కబుర్లు సెప్పిన ప్రతి ఎదవకి ఇల్లు దోచిపెట్టెయ్యడమే. ఆనోటి లాతే.

నా : అయ్యగారిచ్చారండి.

పై : అమ్మగారిచ్చేమంటుందిగాదురా....యిచ్చెయ్-

(రత్నం నోటు లాక్కుంటుంది.)

నాగ: ఎల్లి గుమ్మంకాడ తగలడు. (అర్ధరూపాయి చేతిలో పెట్టి) అనకెల్లి మల్లి పూల్రటా:

పై : ఆ ఎల్లు....ఓరొరేయ్—ఓళ్ళయినా వత్తే పనిమీ దున్నానని సెప్పు .... ఓ రేటి సెపుతావురా!

నా : మరీ అంత ఎదవకింద తీసి పారెయ్యకండి. పదేళ్ళ అనుభవమండి....అయ్యగారు, అమ్మగారితో పనిమీ దున్నారని సెప్పేత్తానండి. (వెళ్ళిపోతాడు.)

నాగ: ఏమయ్యోయ్ ఇదివరకు మన డబ్బుచూసి ఏడ్చే వోరా జనం. ఇప్పుడు నువ్వు పెసిడెంటయ్యాక

ఓయబ్బో ఏటిసెప్పమన్నావు. గుక్కపట్టి మరీ ఏడుస్తు న్నారు—మనీధిచివర రమణక్క లేదు మనం, మనం ఒకటంటూ సాగదియ్యబోయింది. నా మొగుడేమో పెసిరెంటు, ఊరేల్తన్నాడు, నీ మొగుడేమో మట్టిలో పొర్లుతున్నాడ. నీకూ నాకూ సాటా అని నాల్గూ దులిపేసరికి ముఖం గచ్చకాయంత చేసుకొంది.

పై : (బాగా నవ్వుతాడు) రత్తంవా.... మాట .... ఈడ కూకో (అని ప్రెసిడెంటు కుర్చీ చూపిస్తాడు.)

నాగ: ఎందుకూ!

పై : కూకోయే నా పైఫా.... సెపుతానుమరి—నీమాటల్లా కొని నేను పెసిరెంటయ్యాను — నా మాటట్టుకొని నువ్వా కుర్చీలో కూకో. (కూర్చోబెడతాడు) ఓసోస్ నువ్వా కుర్చీలో కూకుంటే రాణి రత్నప్రభ సినీమాలో అంజలీదేవి నాగున్నావే........ ఇదిగో నువ్వు లేసావంటే నామీదొట్టే .... (అంటూ భార్యప్రక్క కులుకుతూ కూర్చుంటాడు.)

నాగ: ఏటా సరసం....ఓలైనా వత్తారు.

పై : ఓళ్ళొత్తారు.... ఓ రొాకేయ్ పీతల నాగన్న లోపలికి గన్నా రాకు .... ఇంకోళ్ళొత్తారు.... ఇలా కూకొని పాటోగాన్న దిగితే చూస్కో నా సామిరంగా — (అంటూ మిడిగుడ్లువేసి చూస్తుంటాడు.)

నాగ: అయ్యో (అంటూ నాగన్న వస్తాడు. పైడిరాజు ఇంకా మిడిగుడ్లు వేసుకొని భార్యా ముఖంలోకి

చూస్తుంటాడు. నాగరత్నం కంగారుగా అతని నుదురుమీద అరచేత్తో కొడుతుంది.)

పై : పాటో పడిపోయిందా (కంగారుగా లేచి నాగన్నను చూస్తాడు.

నా : పిలచారా !

పై : పిలవాలేదు పాడూ లేదూ. ఎల్లి గుమ్మంముందుసావు. పీతమొహం, పీతమొహం అని ఏవొద్దంటే అదే చేస్తాడు. (నాగన్న బయటకు వెళతాడు.)

నాగ: ఏవఁయ్యోయ్ ఓమాట చెపటం మరచేపోయాను.

పై : ఏటది !

నాగ: మన పాత పెసిరెంటు రామరాజు పెళ్ళాం లేదూ ! గుమ్మంలో నిలబడింది.

పై : పక్కింటి కుర్రాడి కాసిగాని చూస్తందేమో.

నాగ: కాదెహే. నన్నుచూసి ముఖం మాడ్చుకొంది. ఆ ముఖం ఎలాగట్టిందో తెలుసా ?

పై : నాకెలా తెలుత్తాదే !

నాగ: చూత్తే తెలిసేది.

పై : నేను దిగిపోయాక నీ ముఖం చూస్తానులే.

నాగ: (ముఖం మాడ్చుకుంటుంది.)

పై : ఇలాగట్టిందేటే ముఖం.

నాగ: నాతో మాటాడకు.

పై : పరాసికానికన్నాను లేయే .... అది సరేగాని ఏటిలా దిగబడ్డావు.

నాగ: నిన్నో మాటడగాలని వచ్చాను.

పై : నీ మాటంటే నా కెంతెక్కువో ఊళ్ళో అందరికి తెలుసు. ఒకటి కాకపోతే పదడుగు.

నాగ: పెసిరెంటయినకాడ్నుంచి ముఖం ఎందుకు చాటేత్తన్నావు ?

పై : (తల పట్టుకొని) ఏటి సెయ్యమంతావే చనం కును కెయ్యకుండా కాల్చుకు తినేత్తన్నాడే ఆశీనయ్యగాడు. ఆడు గుమత్తాకాదే కిందటి జల్మలో నా మొగుడై ఉంటాడు. పెట్టు పెట్టు పెట్టని ఇంత పొడుగు సంతకం బత్తాల బత్తాల కాగితాలమీద గీకించేశాడు.

నాగ: పెల్లాం మొఖం సూడొద్దన్నాడేటి ?

పై : ఆమాట ఏరేగా అనాలేటే. కాపరమె ఈడ పెట్టించేశాడు. రత్తవా నా మాటినే—మన కెందుకొచ్చిన పెసిడెంటుగిరే సెప్పు. తిన్న తిండి వంటబట్టటంలేదు. వంటిలో రకతం నీరై పోతన్నాది.

నాగ: ఆ మాటే అనొద్దన్నాను. ఎంత గౌరవం. ఎంత హోదా.

పై : ఎంత గొడ్డుసాకిరి. ఎంత గొడ్డుసాకిరి. తొమ్మిదింటిదాకా తొంగునేవొన్నా—ఆరింటికే లేవగొడతన్నాడు. మద్దినేల తిన్నసెయ్యి తడారనివ్వడు. రేత్రి నువ్వు నిద్రోతేగాని యిడిసిపెట్టడు. (నవ్వుతుంది) నవ్వులాట కాదెహే, పేనం సాలొచ్చిపోతంది. డబ్బులా కురిపించి పజ్జేయించుకొన్నానుగాని వళ్ళలిసే పని నే నెప్పుడు

సేశాను సెప్పు పెసిరెంటంతే పెజాసేవకుడంట. మనీ దూడ్నే సుబ్బిగాడికి, టంవుకేసే ఎంకడికి, నైట్లైలి గించే పేరిగాడికి అందరికి నేనే సేవకుడ్నంట. ఆ శీనయ్య మాట లింటుంటే....

నాగ: ఏదో మాటూరస కనుంటాడులెద్దూ.

పై : కాదెహే .... ఏదన్నా అంతేసాలు పాత పెసిరెంటు నెత్తి సూపిత్తాడు. ఆడు కూడూ నీళ్ళూ వదిలేసి చేసేవోడంట సేవ, ఆడికి తిన్నాకి లేకపోతే నాకేటి కర్మ.

నాగ: ఈ సోది కేమొచ్చెగాని. నే నడిగిందేటి సేసావు?

పై : ఏటన్నా అడిగాలేటే !

నాగ: అయ్యో రాత. అంతలో ఉంది నా మాటంటే.

పై : అది కాదు రత్తావా.

నాగ: పెసిరెంటు పెళ్లాంవంటే నీపాటి హోదా నాకుండదా సెప్పూ.

పై : ఉండదని వోళ్లైనా అంటే వంద పారేసి నాలిక చీర్పించేగల్ను.

నాగ: మరి మా తమ్ముడి మాటేటి చేశావు ?

పై : నీకో తమ్ముడున్నాడేటే నాకు తెల్దు (కోపంగా చూస్తుంది) ఓహో మీ బాబాయి కొడుకుగదూ. ఏటి సంగతి ?

నాగ: పెసిరెంటుపెళ్ళానివి నీకీ ఉపకారం గొప్పకాదే

అమ్మడూ అంటూ ఎంతదిగా రాసాడనుకొన్నావ్ మా బాబయ్య.

పై : రాతిదిగానే వుందిలే....

నాగ: ఆ వున్న కాళీలో మా తమ్ముడ్నేసి నా పుట్టింటి పరువు నిలబెడతావో లేదో తేల్చుకోనాకొచ్చాను.

పై : ఇప్పుడే పదిమంది పీక్కుతింటున్నారు. ఉద్యోగ మంటేసాలు బెల్లంమీద సీవల్లా మూగిపోతున్నారు జనం. (ముఖం ముడుచుకొంటుంది)

పై : అదికాదు రత్తవా....

నాగ: నువ్వెన్ని సెప్పినా ఆ కాళీలో మా తమ్ముడ్ని ఎయ్యకపోయావో నేను పుట్టింటికి దూరమైపోతాను. (ఏడుస్తుంది)

పై : ఇంతలోకే ఏడుపా....ఊరుకోయే నా వైఫా- డబ్బులా వర్షంలా కురిపించి కొండమీద కోతిని నీ ముందుకు దింపేత్తా నేటనుకుంతన్నావో. (భర్త దగ్గరకు జేరు కొంటుంది)

("పిల్లేదు" నాగన్నగొంతు, "వెళ్లితీరాలి" మరో కీచుగొంతూ గొడవపడుతూ వినిపిస్తున్నాయి)

పై : ఓహోసే. రత్తవా! ఎవడో వత్తాడంట గదిలోకెల్లు.

నాగ: (కోపంగా) ఏటి?

పై : (కంగారుపడి) అదికాదే అడేదో ఆపీసుపనిమీదొచ్చుంతాడు. నేను మాటాడతానంతుంటే ఏటది?

(సాగదీస్తూ నాగరత్నం లోపలికి వెళుతుంది)

(బయటనుంచి నాగన్న, అనంతం లోపలికొస్తారు)

నా : ఈల్లేదంటుంటే

అన : ఎల్లనీయెహే.

నా : అయ్యగారికాడ మాటొత్తాదంటే యినకుండా తోసుకొత్తన్నాడు పిచ్చా ఏటండి.

పై : ఎవడెహే నువ్వు. పెసిరెంటుమనిషిని తోసుకొచ్చేత్తన్నావు గుండా, సెరువా?

అన : అది కాదండి.

నా : అదీలేదు, ఇదీలేదు నడు - ఈనగార్ని సూత్తే నెత్తికెక్కించేసుకొంటారంట. సూడగానే అనుకొన్నాను ఇశాపట్నంనుంచొత్తన్నావని.

అన : అది కాదు బావగారు

నా : ఇన్నారా ఆ మాట.... అనుమానంలేదు ఆ బాపతే

అన : నువ్వుండెహే కందిరీగలాగ.

(లోపల్నుంచి నాగరత్నం "ఏంవయ్యోయ్" అని పిలుస్తుంది)

పై : వచ్చేత్తన్నాను....ఇదిగో అబ్బాయ్ పనిమీదున్నాను గాని బయట కూకో. (లోనికివెళ్ళబోతాడు)

అన : బావగారూ (నాగన్న అతన్ని బయటకు నెడుతుండగా నాగరత్నం లోపల్నుంచి వస్తుంది)

నాగ : అయ్యోయ్యో....నాగన్నా యిడిసిపెట్టు ఆ డోరను కుంతున్నావు.

నా : పిచ్చోడండి....

నాగ: నోర్మూయ్యి.... మా తమ్ముడ్నట్టుకొని పిచ్చోడంటావు ....ఎల్లు ఎల్లి గుమ్మంలో సావు.

పై : ఆఁ........ఎల్లెల్లు (నాగన్న బయటకు వెళతాడు నాగ రత్నాన్ని ఓ వారగా తీసుకొచ్చి) రఁత్తవా ఈడే నా బామ్మర్దిఁ (రత్నం తలూపుతుంది.) (పైడిరాజు అనంతం భుజంమ్మీద చెయ్యివేసి) ఏరా బామ్మర్ది బాగున్నావా?

అ : బాగానే ఉన్నాను బావగారు (అంటూ భుజంమ్మీ దున్న చేతివేలు పట్టుకొంటాడు.)

పై : వెధవ.... మొగోడ్ని నా ఏలట్టుకుంటాడేటి (అంటూ చీత్కారం చేస్తాడు.)

నాగ: చాల్లెద్దూ ........ఏరా తమ్ముడూ ఎప్పుడొచ్చావు?

అ : ఇప్పుడే నక్కయ్యా........ఇంటికి వెళితే నువ్విక్క డున్నావని చెప్పారు. సరాసరి యిక్కడికే వచ్చే శాను. అక్కయ్యా నేనొస్తుంటే వీధిలో జనం విరగబడి చూశారే.

పై : బామ్మర్ది పట్లాం సరిగ్గా కట్టుకొన్నావా?

నాగ: [పెసిరెంటుగారింటి పూతికపుల్లనైనా అలాగే చూస్తారు. స్వయాన బామ్మర్ది వస్తే........

పై : అదిగాదే సంగతి........ఆ తలకట్టుసూడు అచ్చం మన గొడుగేది తలకట్టులా ఉంది. గేపకం ఉందా అచ్చంగా అది కొన్నప్పుడు అలాగే చూసేసేరు.

నాగ: చాల్లే........రాక రాక ఆడొత్తే మంచీ చెడ్డా అడగడం పోయి....తమ్ముడూ నీమాటే సెపుతున్నానురా మీ బావగారితోటి. ఏమయ్యోయ్ ఇప్పుడే సెపుతున్నాను ఆ కాళీలో మావాణ్ణే ఎయ్యాల........ పాపం ఆడికిమాత్రం ఎవరున్నారు.

పై : ఏం పాపం....గోదావరి వరదల్లో కొట్టుకుపోయారేటి?

నాగ: ఏం మాటలయ్యో.

పై : పెసిరెంటు పేరుమీద సానుభూతి ఉత్తరం రాద్దారని.

నాగ: అంతే.

పై : ఓర్రైనా పోయినప్పుడు అలా రాత్తారు.

నాగ: ఛీ....



పై : పెసిడెంటయ్యాక ఒక్కసాలన్నా రాయలేదా ఉత్తరం,



నాగ: ఆ పాడుత్తరాలు గీకనాకి మావోళ్లే దొరికేరా అంట .... ఏరా తమ్ముడూ ఎప్పుడో సిన్నప్పుడు చూశా నిన్ను....అమ్మా, నాన్నా అంతా బాగున్నారా?

పై : చెప్పు బామ్మర్ది ఏ ఒక్కరు పోయినా ఆ ఉత్తరం రాసేద్దాం.



నాగ: ఏమయ్యోయ్.

పై : మాటాడనులేయే.

నాగ: ఊం ....

అ : అంతా బాగానే ఉన్నారు .... అక్కయ్యా ఎంత

చెప్పినా వినకుండా అమ్మా, నాన్నా బెంగపెట్టు కొంటున్నారే.

నాగ: ఎందుకూ!

పై : ఈ ఎదవకి ఈ జల్మలో పెళ్ళికాదని.

నాగ: ఆడికేంకర్మ.... బంగారంలాటి మగాడు.

పై : అదే కూతంత అనుమానంగా ఉంది.

నాగ: ఏమయ్యోయ్.

పై : మాటాడనన్నానుగా (నవ్వుతాడు)

నాగ: ఎందుకురా బెంగ.

అ : నాకు ఉద్యోగం రాదేమోనని.

నాగ: మీ బావగారుండగా నీకెందుకా బెంగ .... ఏంవ య్యోయ్ ఆ కాలీలో మావాడ్నే ఎయ్యాల.

పై : చూద్దాంలేమె.

అ : అక్కయ్యా! మా ఊరి ప్రెసిడెంటు వాళ్ళ బావ మర్దికి వారం రోజుల్లో ఒకటిమార్చి, ఒకటి రెండు ఉద్యోగా లిచ్చాడే— ఆ బావమర్దికి ఆ బావమర్ది ప్రెండుకి, ఆ ప్రెండు పెళ్లానికి....ఆఁ.... (చెప్పుతూ పోతూంటాడు.)

పై : అగాగాగు .... బామ్మర్ది నువ్వొక్కడివే వచ్చావా! ఎంటెవరైనా తోడొచ్చారా?

అ : ఒక్కడ్నే బావగారు (అంటూ ముందుకు రాబో తాడు.)

పై : అంతవరకు మేలే .... ఇక్కడ ఒక్క కాలీయే
ఏడ్సింది.

నాగ: అంటే....ఆ కాలీలో మావాడ్ని ఏత్తావన్నమాటేగా!

పై : నీమాటకు తిరుగెప్పుడుండే....

అ : బావగారూ.

పై : (ఒక్క గెంతు గెంతి) ఆడ్నక్కడే ఉండమను.

నాగ: (నవ్వి) పదరా తమ్ముడూ యింటికి కెళదాం.

పై : పన్లో పని మన మంగలి రాముడ్ని కబురెట్టు.

నాగ: ఎందుకూ!

పై : బామ్మర్ది తలెలామాసిందో చూడు. ఆ తలచూత్తే
మా నెంబర్లు బెంగెట్టుకొంటారు.

నాగ: పదరా తమ్ముడూ కత్తిరేయించుకొందువుగాని.

అ : పట్నంలో ఇది చేసనక్కర్యా.

పై : ఏటి .... తల మాపుకోవడం చేసనా!

అ : అవును బావగారూ.

పై : చూడండి బామ్మర్దిగారు .... ఈ పల్లెలో ఆ చేప
నొదిలేసి అంట కత్తి రేయించుకోండి. (రత్నంతో)
చూడు రత్తేవా.... నువ్వు దగ్గరుండి దెక్కించెయ్యి.

నాగ: పదరా తమ్ముడూ (వెళ్ళబోగా ఎదురుగా శీనయ్య
వస్తాడు.)

శీ : అయ్యా ఉన్నారా?

పై : ఉండక ఊడిపోతా ననుకొన్నావేటి?

శీ : చిత్తం.

పై : ఏటి ఊడిపోతానా.... (అంటూ ప్రెసిడెంటు కుర్చీలో కూర్చుంటాడు.)

శ్రీ : తమర్ని అంతమాట అనగలన్నా .... ఇక పోతే....

పై : (కుర్చీలోనుంచి ఎగిరి గెంతేసి) సూడబ్బాయి నువ్వ అరిసి సచ్చినా సంతకాలుమాత్రం సెయ్యను....ఏలడి పోయింది.

శ్రీ : ఓ మాట చెప్పమంటారా. ఈవేళ తమరు సంత కాలు చెయ్యవలసిన కాగితం ఒక్కటీ లేదంటే నా మాట నమ్ముతారా! (పైడిరాజు కులాసాగా నవ్వ తాడు) తమరీపూట అమ్మగారితో కలిసి యింటికి వెళతానన్నా నా అభ్యంతరం ఏమీ లేదు.

పై : ఆ మాటన్నావు నాకు నచ్చావు, పద రత్తఁవా (ఆగి) ఇదిగో శీనయ్యా పన్లోపని నీకో పదిరూపాయలు పెంచు తున్నానుగాని....కాయితం రాసట్టుకురా....మార త్తం సూత్తుండగా ఓ సంతకం గీకి పోతాను.

శ్రీ : లాభం లేదండి........

పై : ఏటి! పైడిరాజు మాటన్నాక....

శ్రీ : రూల్సు ఒప్పుకోవండి:

పై : రూల్సంట, రూల్సు .... .... ఆ పదీ నేనే యిత్తాను (రత్నం కోపంగా చూస్తుంది) మా రత్తంతో సెప్పి ఆర్డేసాత్తాను.

నాగ: ఆ ఆర్డు సింపి పొయిలో ఏత్తాను.

పై : అదికాదు రత్తఁవా!

నాగ: ముందు మా తమ్ముడికి కెయ్యి ఆద్రు.

శ్రీ : దేనికండి ?

పై : అదేనయ్యా.... మనాఫీసులో ఉన్న కాళీలో ....

శ్రీ : అది వీలుకాదని అమ్మగారితో చెప్పండి.

నాగ: ఎందుకని ?

శ్రీ : ఆ వుద్యోగానికి ఎమ్మెల్లేగారి కుర్రాడున్నాడు. అది ఆ కుర్రాడికి రాసిపెట్టుంది.

నాగ: ఈల్లేదు మావారికింద ఉద్యోగం ఆడికెవరికో రాసి పెట్టుండటం ఏటి - అది మా తమ్ముడికే రాసి పెట్టాల.

శ్రీ : అమ్మా! తమకి ఉద్యోగపర్వంలో అనుభవంలేక అలా అంటున్నారు. మరో పైవాడి కుర్రాడెవరైనా వస్తే యమ్మెల్లేగారి కుర్రాడు తోక ముడవవలసిందే.

నాగ: అంటే మావాడ్ని తోక ముడవమంటావా ఏవం య్యోయ్ విన్నావా (అంటూ రాగాలాపన మొదలు పెట్టబోతుంది.)

పై : ఊరుకో....ఊరుకోయే నా వైపా....నేనుండగా నీకేడు పేటి ? ఇదిగో శీనయ్యోయ్ నా మాట కాదని సంత కాలు గీకిత్తే ఊరుకోన్నాను.... మా నాగరత్తం మాటంటే ఊరి పెసిరెంటును నేనే అడ్డు చెప్పను. బోడిగుమస్తాగాడివి నువ్వెంత.... ఏసెయ్యి మాటాడ కుండా బామ్మర్ది పేర ఆద్రు.

శ్రీ : అది కాదండి

పై : నువ్వు సెటప్పంతే....
శీ : మరి వారి అర్హతలు....
పై : అర్హతలేసెహే....పెసిరెంటుగారి బామ్మర్ది అంతే.
నా : మరోటొచ్చినప్పుడు ఎమ్మెల్లేగార్ని చూచుకోవచ్చు లెండి.
పై : మా బాగన్నావురా....
నా : అప్పుడప్పుడు శీనయ్యగారికంటే నానే బాగా ....
(శీనయ్య కోపంగా చూస్తాడు. నాగన్న నోరు మూసుకొంటాడు)
శీ : అయ్యా ఈ వ్యవహారంతో మన పంచాయితీబోర్డుకు చెడ్డపేరొస్తుంది.
పై : అలాగంతవా (అంటూ భార్యవైపు ఏం చెప్పమంటా వన్నట్లు చూస్తాడు)
నార : ఈల్లేదు.
పై : (శీనయ్యతో) అవును ఈల్లేదు,
అ : పోనీలే అక్కయ్యా ఎందుకు గొడవ
నా.ర: నువ్వూరుకోరా నా పుట్టింటి పరువో
నాగ: మరేనండి ఆడదాని కత్తింటి పరువుపోయినా పరవా లేదుగానండి పుట్టింటి పరువంటే (సాగదీస్తూంటాడు)
పై : నువ్వు సెట్టప్పాసే....
నాగ : ఏంవయ్యాయ్....
పై : నేనే యిత్తానన్నానుగాదే....నువ్వింటికెల్లు.. బామ్మర్ది మీాయక్కని యింటికి తోలుకెల్లు-

నాగ: యిప్పుడే సపుతున్నాను.... నువ్వుగాని మావోడికి ఆ|డెయ్యకపోయావో గుమ్మంలో తొంగోబెడతాను. (అంటూ విసురుగా అనంతంతో బయటకు వెళ్ళి పోతుంది)

పై : శీనయ్యా బామ్మర్ది పేర కాయితంగీకి పట్రా సతకం.....

శీ : అయ్యా దీనివల్ల మన పంచాయితీకి చెడ్డ పేరొస్తుంది.

పై : ఏటెహే

శీ : నేను చెప్పవలసింది చెప్పాను.

పై : నేను వినవలసింది విన్నాను.... ఇంక మూసెయ్యి మీ ఎమ్మెల్లేని....

శీ : అయితే పదండి. సంతకాలు చేద్దురుగాని....

పై : సతకాలేటి? ఇప్పుడేగదంటయ్యా సంతకాలు సేసే కాయితం ఒక్కటీ లేదన్నావు....

శీ : ఇవి కాగితాలు కావండి ఎకౌంట్లు.

పై : అయితే నాకేటి తెలుత్తాయి.

శీ : తెలసినా తెలియకపోయినా వాటిమీద తమరే సంత కాలు చెయ్యాలి.

పై : (వేలుచూసుకొంటూ) అయితే పద ఇద్దరూ లోప లికి వెళతారు.

(నాగన్న బల్లమీదున్న అగ్గిపెట్టితో చుట్ట వెలి గించి, |పెసిడెంటు కర్చీలో కూర్చుని కూనిరాగం తీస్తుంటాడు. బయటనుంచి పకీరొస్తాడు)

ప : (నాగన్న చొక్కా పట్టుకొని) ఓ రేయ్ పెసిరెంటు

నా : అయ్యబాబోయ్ పకీరు నేను పెసిరెంటునుకాను.... పీతల నాగన్నని పెసిరెంటుగారు లోపలున్నారు.

ప : అయితే పిలాడ్ని.

నా : ఎందుకూ?

ప : పొడిసిపారేత్తాను.

నా : అయితే పిలుత్తానాగు (అంటూ లోపలికిపరిగెత్తుతాడు పకీరు టేబులుమీద వెనక్కి తిరిగి కూర్చొని కత్తి సానబెడుతుంటాడు. (పెసిడెంటు పైడిరాజు ఠీవిగా వస్తాడు)

పై : ఓరెసే నువ్వా?

ప : (తల తిప్పకుండా) పకీరు.

పై : ఏటా తలబిరుసు.... ఓరోరేయ్ నీలాంటి సన్నాసుల్తో మాటడనాకి కాదెహె నేను పెసిరెంటు నవుత.... ఓటాంకోసి కొన్నాను. ఎరికేనా.... కావాలంటే లోపలికెల్లిసూడు ఎన్ని బత్తాల కాయితాలమీద సంతకాలు గీకానో

ప : అయితే నువ్వేనేటి పెసిరెంటు

పై : కాదనోడ్ని ఎదరకొచ్చి నిలబడమను.... వండి....

ప : అయితే ఎదరకొచ్చి నిలబడు

పై : ఏంచేత్తా వేటి?

ప : (టకీమని కత్తి బల్లమీదగుచ్చి) పొడిసిపారేత్తాను.

పై : ఏ....ఏటి....ఎందుకు....కత్తి

ప : నేను గుడిసేసుకోంటే పీకిపారెయ్యమన్నావంట.... ఈ పకీరుగాడి జోలికి రానాకి గుండా, సెరువా.

పై : ఆఫీసులో అడుగెట్టి అల్లరి సేత్తన్నావని జెయిల్లో తోయిత్తాను.

ప : అది మా అత్తగారిల్లే.... భయంలేదు. ఇప్పుడాడనుంచే వత్తన్నాను.

పై : (భయంతో నాగన్నను ప్రక్కకు లాక్కువెళ్ళి) ఎవ్వడ్రా ఈడు.

నాగన్న: పేరిగాడండి.... మహా కర్కోటకుడు—కోడిపీకలాగ మనిషిపీక తెగేత్తే జెయిల్లో ఏసారు పదేళ్ళకింద .... అప్పటికి తేంవరింకా మాఊళ్ళో భూంవులు కొన్లేదండి.

పై : మరిప్పుడెలా వచ్చేడంటావు.

నాగన్న: ఇడిసిపెట్టినట్టున్నారండి.

ప : నామాట చెప్పకుండా ఏటా గుస గుసలు.... పొడిసి పారేత్తాను.

పై : ఆఫీసులో అత్తమాను అలా పొడుత్తా ననగూడదు.

ప : అయితే బయిటకిరా అక్కడే పొడిసేత్తాను.

పై : అదికాదు పకీరుగారు.... నేను సెప్పేదేటంటే....

ప : గుడిసేసుకోనాకి కాయితం నా ముఖాన్ని కొట్టాక నువ్వేటి సెప్పినా యింటాను.

పై : అలాగే .... శీనయ్యా .... ఓయ్ శీనయ్యా.
("వస్తున్నానండి" లోపల్నించి శీనయ్య కేక వేస్తాడు.)

పై : త్వరగా రావయ్యా బాబు....పకీరు శీనయ్యొస్తున్నాడు గాని కంగారుపడకు.

ప : నాకేటి కంగారు....వస్తే ఆడ్ని పొడిసేత్తాను.

శీ : ఏమిటండి.

పై : పకీరు....కత్తి....గుడిసె—పొడిసేత్తానంటున్నాడు.

శీ : గుడిసె పొడిచెయ్యడం ఏమిటండి.

పై : గుడిసె కాదయ్యాబాబు .... నన్నూ, నిన్నూ పొడిసేత్తాడంట....

శీ : మధ్య నేనేం చేశాను.

పై : నువ్వే గుడిసె పీకెయ్యమన్నావంట.

శీ : పైగా యిదొకటా....ప్రెసిడెంటుగారి ఆర్డరు లేకుండా గుడిసె వేస్తాడా పీకి పారెయ్యి అన్నారు మీరు —కాదురా నాగన్నా.

నాగన్న: ఆరంభంలో నేనూ యున్నానండి.

ప : అవునంటయ్యా....అయితే కాసుకో .... (కత్తి ఎత్తి పైడిరాజు చొక్కా పట్టుకొంటాడు.)

పై : శీనయ్యా కాయితం రాసట్టుకురా

శీ : రూల్సు వప్పుకోవండి.

ప : కత్తి దిగెయ్యనాక నాకు రూల్సు లేవెహే.

పై : ఓ పక్కని పేణాలు పోతుంటే రూల్సేటెహే.

శీ : లాభం లేదండి మెంబర్లంతా వచ్చి తీర్మానం చెయ్యండే.

పై : దాని యమ్మాకడుపు కాలిన తీర్మానం — ఓ పక్క నుంచి పొడిసేత్తుంటే తీర్మానం ఏటయ్యా. రా సట్టు కురా....

శీ : అర్జీ పెట్టకుండా, సొమ్ము కట్టకుండా.

ప : సొమ్ములా తీసుకో ఎహే (అంటూ మొలనున్న ముడి చూపిస్తాడు.)

శీ : మరి అర్జీయో!

ప : రాసట్టుకురా.... సంతకం నొక్కుత్తాను.

(శీనయ్య లోపలికి వెళతాడు. వెనకే నాగన్న వెళతాడు.)

పై : సూడు పకీరు.

ప : (పైడిరాజు చెయ్యి పట్టుకొని) సెప్పు యింటున్నాను.

పై : పది నిమిసాలాగి రాగూడదు కాయితం పట్టుకుపోదువు గాని.

ప : వచ్చేక వట్టిసేతుల్తో ఎల్లను ఎరికేనా!

పై : అలాగే.

ప : పేరు గుర్తేనా.

పై : పకీరు (పకీరు కత్తి పైడిరాజు పీకమీద ఆనిస్తాడు.) పొడిసేసే పకీరు (పకీరు నవ్వుతూ బయటకు వెళ్ళిపోతాడు. పైడిరాజు అలాగే అచేతనంగా నిలబడిపోతాడు. శీనయ్య, నాగన్న వస్తారు. శీనయ్య చెయ్యి పైడిరాజు ముఖంముందు ఆనిస్తాడు.)

పై : (తృళ్ళిపడి) పకీరు .... పది నిమసాల్లో కాయితం ....
శీ : ఇంకెక్కడి పకీరండి యిందాకే వెళ్ళిపోయాడు.
నాగన్న: (సోడాకొట్టి పైడిరాజుకు అందిస్తాడు)
పై : (సోడా ఆత్రంగా త్రాగి) ఓలమ్మ లంబ్డీకొడుకు ఉన్న పది నిమసాల్లో అడలకొట్టి సంపీసాడు గదరా....
శీ : అయ్యా యింక మీ రూరుకొంటే లాభంలేదు.
పై : ఏటి సెయ్యమంతావయ్యా ఆడిమాట కరుకు సూసినా కత్తి పదును సూసి పేనాలు కొండెక్కి-పోతన్నాయి.
శీ : రిపోర్టివ్వండి .... క్షణంలో వస్తారు పోలీసులు.
పై : అరక్షణంలో పొడిసి పారేత్తాడు. పేణాలు పోయాగ్గాని పోలీసులు రారు.
శీ : అయితే ఏం చేద్దామంటారు ?
పై : ఇదిగో మనకెందుకొచ్చిన గొడవగాని కాయితం రాసట్టా ఆడి మొకాన్న కొట్టి దర్జాగా కూకుందాం.
శీ : అది అంత త్వరగా అయ్యే వ్యవహారం కాదని యిందాకే మనవిచేశాను.
పై : ఓర్నాయనోయ్ .... ఎంత డేంజ రపాయంలో పడిపోయానా).... ఆనాడు సీతమ్మోరు రావణాసురిడి పాలుబడింది — ఈనాడు నేనీ పకీరుగాడి పాలబడ్డాను. (నాగన్నతో) నువ్వెల్లి ఆ గుమ్మంముందు సావరా ఆడు తొందరపడి లోపలికి రాకుండాను.
నా : ఓరండీ!
పై : ఆడే పొడిసేసే పకీరు.

నా : ఓలమ్మో ఆడొత్తే అపనాకి నాతరం కాదుగదా, మాయబ్బను పుట్టించినోడి తరంకూడా కాదండి.

పై : (భయంతో వెకిలిగా నవ్వి) ఎందుకురా భయం.... మగాళ్ళం నేను, శీనయ్యా ఉన్నాంగా .... ఎల్లు....

నా : ఓలమ్మో.... నే నెల్లనండి.

పై : (నాగన్న మెడమీద కొట్టి ముందుకు తోస్తాడు) ఎల్లహే....పీత మొహం, పీత మొహం అని.

నా : ఆడేదో చేత్తానంటే నామీద పడతారేటండి.

(అని గొణుక్కుంటూ బయటకు వెళతాడు)

పై : (శీనయ్యతో) ఎలాగెట్టుకొన్నారయ్యా ఆపీసులో యిలాంటి పిరికి సన్నాసుల్ని.

శీ : చిత్తం.

పై : శీనయ్యా ఆడిసంగతి సరే .... నన్నేటి సెయ్యమంతా వయ్యా.

శీ : నేనేం చెప్పనండి. అయినా మేం చెప్పేది మీకు నచ్చుతుందా ఏమన్నానా అన్నీ మీ మాట ప్రకారమే నడవాలని ఆర్డరు.

పై : బుద్ధి గడ్డితిని ఏసానా ఆర్డరు. ఆడు పకీరుగాడు....నిజంగానే పొడిసేత్తాడంతావా ?

శీ : చిత్తం మనిషిని చూస్తే మాట తప్పేలా లేడండి.

పై : (భయపడతాడు. ఏదో ఆలోచించి) ఇదిగో రెండు రోజులు చెలవు గీకేసి పక్కూరికి పారిపొమ్మంతావేటి?

శీ : ఆ ఏ ఊరని వెడతారు ?

పై : అదేనయ్యా మా పెద్ద బామ్మర్దిగాడి బారసాలన్జెప్పి-

శ్రీ : నలభై ఏళ్ళొచ్చాక ఆయన బారసాలేటండి?

పై : అదేనయ్యా మా పెద్ద బామ్మర్ది పెళ్ళానికి లేక లేక కొడుకట్టాడని.....

శ్రీ : అమ్మా మీరు వెళ్ళిపోతే ఇక్కడి వ్యవహారం.... సంతకాలు....

పై : ఇంకా సంతకాలేటెహే....ఆడు పోడవనాకి లడీగా ఉంటేను.

శ్రీ : మరి ప్రెసిడెంటులేం ఏమిటనుకొన్నారు. బావమర్దికి ఉద్యోగం ఇవ్వడం అనుకొన్నారా?

పై : ఏటి?

శ్రీ : చిత్తం వచ్చినట్లు వెర్రి మొర్రి ఆర్డర్లు వెయ్యడం అనుకొన్నారా?

పై : ఏటెహే

శ్రీ : అపాయాన్ని ఉపాయంతో తప్పించుకోవాలి. కత్తిని యుక్తితో గెలవాలి.

పై : యుక్తేటెహే గాడిదగుడ్డు....వంద వందపారేసి

శ్రీ : మీ వందలు. వేలు మిమ్మల్ని రక్షించవని తెలుసుకొంటేమంచిది. రామరాజుగారు ధర్మరాజు - ప్రజలకు తల్లో నాలికలా వుండేవారు. వాళ్ళ బాధల్లో భాగం పంచుకొనేవారు. ఊరికి ఉపకారం జరుగుతుందంటే ప్రాణాలివ్వడానికి వెనుకాడేవారు కాదు.

పై : ఆడిమాట నాకాడె త్తకెహే.
శీ : వారిని కాదని మీరీ పదవిలోకొచ్చారు - కేవలం మీ అడవారి మాటకోసం రామరాజుగార్ని తోసి పుచ్చారు - అందుకే అనుభవించండి.

(లోపలికి వెళ్ళిపోతాడు)

పై : భయంతో అటూ ఇటూ చూసి తనూ లోపలికి వెళ్ళబోతాడు. బయటనుంచి నాగన్న పరుగెత్తు కొస్తాడు) ఓరేట్రా అది ?
నా : ఆడు....ఆడు.... ఆగండి సాలొత్తంది....
పై : ఓట్రా !
నా : ఆడే పకీరుగాడు....
పై : శీనయ్య పకీరుగా డొచ్చేత్తన్నాడంట....
నా : రాంవటంలేదండి.
పై : ఛ....పీత మొకం ఎదవని....అడలగొట్టి సంపేసావు-
నా : మేకల్ని కోసే కత్తి సానబడతన్నాడని మన నాగులు గాడు పోతూ పోతూ సెప్పిపోయాడండి.
పై : ఏటి నాగులుగాడా ! మన నాగులుగాడు ఊళ్ళోనే ఉన్నాడా! పోయి నేను రమ్మంటున్నానని సెప్పు ఎల్లు ....ఒరోరేయ్ ఎనకో నలుగుర్ని ఎంటేసుకు రమ్మను.
నా : ఎందుకండి ?
పై : ఎందుకా! నలుగురికి నాలుగొందలు పారేసి ఈ పకీరు గాడికి పులుసులో దుమ్ములేకుండా ఏరించేత్తాను. ....పంచాయితీబోర్డు పెసిరెంటనుకొన్నాడా మజాకా

నా : లాభంలేదండి. పకీరుగాడ్ని సూత్తే నాగులుగాడిసెయ్యి పత్తోతం తగిల్నట్టు పడిపోద్దండి....ఎదవ మొన్నటి దాకా మీసాలు తిప్పుతూ తిరిగాడా .... పకీరు గాడు రాగానే ఆడి కాళ్ళు పిసుకుతున్నాడు.

పై : శీనయ్యా పకీరుగాడు మేకల్ని కోసే కత్తట్టుకొత్తన్నాడంట. (అంటూ భయంగా లోపలికి పరిగెత్తుతాడు)

నా : పాడిసిపారేత్తానేహే....ఓరి పకీరు కత్తిచూపించి పైడి రాజుగార్ని అడలగొట్టి పారేసినావుగదరా. బత్తాల చెత్తకాయితాలమీద సంతకాలు ఏలడిపోయిందాకా గీకించినా లొంగని మారాజు కత్తి చూడగానే బెంబేలెత్తిపోతున్నారు. ఓరీ పైడిరాజు - రామరాజుగారు ధర్మరాజురా - ఆరెల్లినకాడ్నుంచి నీ పాలడ్డాం-పేనాలు కొరికేత్తన్నావు, గడ్డి కరిపించేత్తన్నావు.... ఒరొరేయ్ పకీరు ఈరుగన్నా గద్దెదిగిపోతే నీకు కోడి పెట్టను బలేత్తాను—మాంచి జట్టీపెట్టను బలేత్తాను. (చివరిమాటవింటూ పైడిరాజు, అతని వెనక శీనయ్య వస్తారు)

పై : ఓరేఁటా బలేత్తానంటున్నావు....నన్నేనా ?

నా : (కంగారుపడి) కాదండి.... మీకీ గండం గడిసిపోతే మనూరి పోలేరమ్మకి కోడిపెట్ట - జట్టీపెట్టని బలేత్తానంటున్నానండి. ఉండండి ఆడేటిచేస్తన్నాడో చూసొత్తాను.

(వెళ్ళతాడు)

శీ : ఆఁ.... ఏం చేస్తుంటార్రా.... కత్తి దిగేస్తే మధ్యలో ఆగిపోకుండా దిగేలా సానబడుతుంటాడు.

పై : నువ్వు సెటప్పాసె....అసలే గుండె లబ్డిక్, లబ్డిక్ మని కొట్టుకొంతన్నాది. (నాగన్న నవ్వుకుంటూ బయటకు వెళతాడు)

శీ : పకీరుగాడికి నలుగురిలోను చెప్పి పొడవటం అలవాటే నండి

పై : ఏటయ్యా యిది. ఏటి చెయ్యమంతావో సెప్పవయ్యా అంతే అడలగొట్టి సంపేత్తావేటి ?

శీ : చెప్పవలసింది ఇందాకే చెప్పాను.

పై : (ఏడుపు ముఖంతో కుర్చీలో కూర్చుంటాడు) తప్ప దంటావా !

శీ : బతకాలంటే తప్పదండి.

పై : ఆలోచిస్తుంటాడు)

శీ : వాడొచ్చే టైము అయిందనుకొంటాను-

పై : రాసెయ్యి....రాసెయ్యి (శీనయ్య లోపలికి వెళతాడు) ఒరొరేయ్ రామరాజు నీ సురేకొట్టిందిరా నన్ను.

(నాగరత్నం, అనంతం వస్తారు)

నాక: ఏఁవయ్యోయ్

పై : పకీరుగాడు కత్తెట్టు కొత్తనాడా ?

నా : ఏటి?

పై : (భార్యనిచూచి సర్దుకొని) నువ్వా....

నాగ: నేనే....ఏఁవయ్యోయ్ మన పక్కింటి పుల్లక్క లేమా

పై : ఏం మళ్ళా లేచిపోయిందా!

అన: అదికాదు బావగారు అక్కయ్య అదృష్టాన్ని ఇంత పొడుగు సాగదీసింది.

నాగ: పెసిరెంటు పెళ్ళామంటే మాటలు కాదేబుల్లి - అంద రికి ఆ గీత ఉండొద్దూ అంటూ తెగ బారెడు సాగ దీసింది.

అన : అక్కయ్యా ఆ అబ్బా ఎవరోగాని....

నాగ: ఇంకెవ్వరా మన బసవయ్య కొడుకు - అత్తయ్యా మాంవయ్యను నువ్వే పెసిరెంటు చేశావట, అంతా అంటున్నారు నిజమేనా అంటూ వచ్చాడు.

పై : నీమాట యినకుంటే బాగుండేదని సెప్పలేకపోయావా?

నాగ: ఏటా మాట.

పై : ఇదిగో రత్తంవా! నీకు పెసిరెంటు కావాలా మంగళ సూత్రంవా?

నాగ: అంటే?

పై : నేను పెసిరెంటుగా ఉంటే ఆడు బతకనివ్వడు నేను చత్తే నీ మంగళసూత్ర పుటుక్కున తెగిపోద్ది.

నాగ: అయ్యో....అయ్యో? (అంటూ కంగారు పడుతుంది) విన్నావురా తమ్ముడూ ఆయన మాటలు—

పై : బామ్మర్ది నేంచేత్తాడే ఎదవ నువ్వినాల .... నన్ని కత్తిమీద నిలబెట్టింది నువ్వు .... ఆడి ముందుకు తోసింది నువ్వు ....

నాగ: ఆడెవరు?

పై : పకీరుగాడని—నా పాలిట రావణాసురుడు — మను
సుల్ని మేకల్ని సమానంగానే నరుకుతాడంట—

అ : ఏడిసాడు....

పై : ఒరే బామ్మర్ది.... నేను సచ్చిపోతే నువ్వేడుస్తావురా!

అ : గుక్కపట్టి ఏడుస్తాను బావగారు .... మొదలెట్ట
మంటారాఅ........

నాగ: నీమీాదకి కత్తెత్తనాకి ఆడికి గుండా, సెరువా!

పై : ఆడిది సెరువంత గుండె—పోనీ ఓపని చేత్తావా!

నాగ: ఏటి!

పై : ఆడొత్తే నువ్వు ముందు నిలబడు.

నాగ: ఏటి....ఆ దేవడో ఎదవ కత్తి అట్టుకొత్తే ఆడదాన్ని
నన్ను ముందెట్టి నువ్వెనక నిలబడతావా ....

పై : ఆడదానిలా నువ్విన్నాళ్ళు ఎనకే ఉంటే నాకీరోజు
ఈ తిప్ప లొచ్చేవేకావు .... రా

నాగ: ఎక్కడికి?

పై : ఎల్లి ఆడి కాళ్ళమీాద పడి, లెంపలేసుకొందాం— కని
కారంతో యిడిసి పెడతాడు. (భార్య చెయ్యిపట్టుకొని
ముందుకు లాగుతాడు. ఎదురుగా నాగన్న పరుగెత్తు
కొస్తాడు) మళ్ళీ ఏటి మోసుకొచ్చావురా సావు
కబురు ...

నాగన్న: నా కళ్ళతో చూసొచ్చానండి.

పై : ఏటది?

నాగన్న: ఇందాక తెచ్చింది సిన్నకత్తండి. దాన్తో మను
సులు సత్తారంటే నమ్మకం లేదండి. ఈపాలి నిజమే
నండి .... మేకల్నూరే కత్తి—ఆ కత్తి సాన బడు
తుంటే ఓ సప్పుడు పుట్టిందండి. ఆ సప్పుడింటే
యిందాక మీరు సెప్పారు సూడండి అలా లబ్దిక
లబ్డికమని కొట్టుకొన్నాయండి నా గుండెలు —
కత్తి నూరి లేచి నిలబడ్డాడండి—బరిమీద పులి నిల
బడతాది సూడండి అలా గున్నాడు — పంచలో
సారాసీసా తీసి గడగడ గుక్క తిప్పకుండా తాగేసా
డండి .... ఆ మట్టున

పై : వస్తన్నాడా? (ముగ్గురు లోపలికి పరిగెత్తబోతారు.)

నాగన్న: ఇంకా రావటం లేదండి— తాగేక యిక్కడికే వత్తా
డని ముందు లగెత్తుకొచ్చానండి....

పై : ఓయ్ శీనయ్యా .... ఇంకా ఎంతసేపు రాత్తావయ్యా
బెమ్మరాత, పకీరుగా డొచ్చేత్తుంటేను....

శీ : అయిపోయిందండి.

పై : ఏది

శీ : ఇక్కడ మీరు సంతకం చేస్తే చాలు—

పై : సాలుగదా! పొడుగు సంతకం .... ఆకరి పొడుగు
సంతకం ఒక్కటంటే ఒక్కటి పట్టు.

(సంతకం చేస్తాడు)

నాగ: మా తమ్ముడు ఉద్యోగానికి ఆర్డేనా!

అన : అక్కయ్యా వెళ్ళి ఉద్యోగం వచ్చిందని టెలిగ్రాం యిచ్చొస్తాను....బావగారు పోతూ పోతూ పోలీసు స్టేషను వెళ్ళి.

పై : పోలీసు టేసను కెందుకురా .... రైలుటేసనుకెళ్ళి బండి ఎక్కి మీ ఊరెల్లు. ఎల్లాక ఉద్యోగం రాలేదని సెప్పు.

అన : అక్కయ్యా

నాగ: ఆ కాళీలో మా తమ్ముడ్నెయ్యక పోయావో

పై : (నవ్వి) ఇక్కడ్నేనుంటేగదే ఎయ్యనాకి.

నాగ: అంటే !

పై : ఒరే బామ్మర్ది. సదూ
కాయితం సదువు.

అ : (తిప్పుకొంటూ చదివి)

నాగ: ఏమైందిరా.

అ : బావగారు రాజీనామా

నాగ: ఈల్లేదు....మాతమ్ముడ్ని ముంచ

నా : అయ్యబాబోయ్ (అని బయటకు చూసి అరుస్తాడు.)

పై : ఎవరు పకీరుగాడే ....

నా : కాదు పోలీసండి.

పై : ఎదవని .... ఎదవ .... పోలీసునుచూసి పకీరు కేసి నంత కేకేస్తావేట్రా—ఈ డెందుకొస్తున్నాడు సెప్మా!

నాగ: ఎందుకేటి .... పండుగ మామూలు దండుకు పోనాకి.

(పోలీసు వచ్చి పైడిరాజుకు సెల్యూట్ చేస్తాడు.)

పై : ఏ టప్పలసామి ఇలా దిగబడ్డావు?

పో : మా ఇన్స్పెక్టరుగారు రేపు కేంపుకొస్తన్నారండి.... పోయినసారి కొవ్వుపట్టిన కోడిపెట్టను తిన్నాక ఇంట్లో సెప్పారంట, అమ్మగారుకూడా వత్తన్నారండి.

నాగ: ఇక్కడ కోడిపెట్టలూలేవు .... కొవ్వంతకంటె లేదు పోయి సెప్పు .... ఊళ్ళో ....

పో : అమ్మమ్మ అంత మాటనకండి....ఊళ్లో నోరక్కపోతే యింటిపెట్టనన్నా కొయ్యాలండి – అమ్మగారితో యవ్వారమండి....ఆరి మాటంటే మా అయ్యగారు డూటీకూడా మరసిపోతారండి....ఏమండోయ్ ఇప్పుడే సెప్తున్నాను, మాయమ్మగారికి కారం పడదండి.... ఏమాట కామాటే సెప్పాల మా అయ్యగారికి మాత్రం తుపాకీ మందులాగుండాలండి కారం.... మరి పోతే నాకు. ....

నాగ: కూడా రావద్దంటే ఎత్తుకోమన్నట్టుంది – ఎల్లు....ఎల్లి మా ఊళ్ళోకోడిపెట్టలు....

పై : రత్తఁవా !

నాగ: ఏమయ్యోయ్ నా మాట కడ్డురాకు....

పై : నువ్వాఁడవే (కళ్లు మెరుస్తాయి) ఇదిగో అప్పల సాఁయి....

పో : అయ్ !

పై : పెట్టలు, పుంజులు కలేసి అరడజను కోయిస్తాను

పో : (లొట్టలేసి) అయ్....కారంమాట....

పై : చెర్లో కారం ఆగహే....ఇదేగో నువ్వు క నెత్తా కూడారండి.

పో : లాభం లేదండి.... అదొస్తే మాయత్తగాని ఊరు కోదు.... మా యత్తగారొత్తే ఆరు సాలవండి.

పై : సాలకపోతే మీ యత్తగార్కి మేకిపోతును కోయి స్తాను....

పో : ఆయ్.... ఆలాగన్నారు దణ్ణవండి.... మరొస్తావండి.

పై : నువ్వొక పన్జెయ్యాల

పో : ఏటో సెప్పండి ఉఫ్ అని ఊదిపారేత్తాను.

("ఓరోరేయ్ కాయితం" పకీరు గొంతు మొరం నుంచి వినిపిస్తుంది)

పై : అప్పలసామి మా బామ్మర్ది నట్టుకొని ఆ గదిలో కెల్లు....

పో : ఆరితో గదిలోకెందుకండి....

పై : ఎల్లుముందు బామ్మర్ది ఎల్లరా....

అ : రండి (అంటూ తిప్పుకొంటూ గదిలోకి వెళతాడు. అనుమానంగా పోలీసు వెనకే వెళతాడు)

(పైడిరాజు జేబులోంచి చుట్టతీసి నోట్లో పెట్టు కొంటాడు)

పై : ఓరి నాగన్న (నాగన్న అగ్గిపుల్ల వెలిగించి అతని చుట్ట ముట్టిస్తాడు. పకీరు తూలుతూ వస్తాడు. నాగ రత్నం వాడి చేతిలో కత్తిచూచి భర్త కుర్చీపక్కకి జేరుతుంది)

శ్రీ : (కంగారుగా) పకీరు

ప : కాయితం లడీయేనా.... కత్తి లడీగా పట్టుకొచ్చాను.
శీ : చూడు పకీరు ఆ కత్తి....
ప : పొడిసిపారేత్తాను.
పై : నాగన్నా ఆ కత్తితో పొడిస్తే మనుషులు చస్తార్రా.
నా : మేక.... కత్తి.... పొడిసే....
పై : చస్.... పిరికి ఎదవ....
ప : ఏయ్ పెసిడెంటు
పై : సెటప్పానే.... మా నాగన్నతో మాటాడతన్నాను
....ఏరా నాగన్నా....
ప : నా మాట సెప్పకుంటే పొడిసి....
శీ : పకీరు అవన్నీ ఎందుకు చెప్పు.... నేను చెపుతాను....
నీ గుడిసెకు కాయితం యిస్తారు.
పై : కత్తిసంగతి తేల్తేగాని కాయితం ముక్కకూడా
యివ్వను.
శీ : పకీరు నా మాట విను....
ప : ఏం పెసిడెంటు మందుగాని కొట్టావేటి మా ధైర్నంగా
మాటాడతన్నావు చూపించమంటావేటి నా తడాకా....
పై : ఓరోరేయ్.... నన్నా చూపించమంటావేటి
నాగ : ఏవయ్యోయ్.... ఆడితో సరసాలేటి!
పై : కుక్కలా మొరిగేవోళ్ళు కరవరేహే
ప : ఆఁయ్ (ముందుకు రాబోతాడు. శీనయ్య నాగన్న
మధ్యలోకి వచ్చి)
శీ : పకీరు నా మాట వినమన్నానా....
నా : అవును పకీరు ....ఎల్లి....

(పోలీసు కప్పను తొక్కినట్లు ఒక్క గెంతులో వస్తాడు)

పో : ఏటండి మీ బామ్మర్ది....

పై : ఏం ఏలట్టుకొన్నాడా....

పో : సాల్లెండి సరసం. ఆ గదిలో నా లాకీ ఉందిలా పడెయ్యమనండి పోతాను.

(శీనయ్య, నాగన్న పకీరును బలవంతంగా బయటకు తోస్తుంటారు)

ప : పోలీసును చూడగానే పిల్లైయిపోతాడు) అయితే ఎప్పి మళ్లా రమ్మంటారేటి? (వెళ్ళిపోతాడు)

పై : ఆగవే.... కదిత్తే పొడిసిపారేత్తాను....

(పకీర్ని పోలీసు చూస్తాడు)

పో : ఏటేటి.... పకీరుగాడే.... పెల్లికొడుకునిచేసా బా కత్తట్టుకుబయులుదేరావు

అ : (లాకీతో వస్తాడు) అదికాదండీ ఆ కత్తితో మా బావగార్ని పొడుస్తానని.... (పోలీసు లాకీ లాక్కుంటాడు)

పో : ఏటి పెసిడెంటుగార్నే....ఏటేటి....ఓరేయ్ పకీరు పెసిడెంటుగారంటే ఊరు మనిషిరా .... ఆర్ని పొడిత్తే ఊరందర్ని పొడిసినట్లే .... మళ్ళా తిరిగి రాకుండా వందేళ్లేస్తారు జెయిల్లో.

పై : అడ్ని జెయిల్లో ఏసేలోపుగా మీరంతా --

పో : ఏటి!

పై : ఆ కత్తి అందుకేనంట.... ఏం పకీరు కోసుకుపోయింది.

ప : ఆరి మాట కేటండి.... నా యాపారం....

పై : మనుషుల్ని పొడవటమా!

ప : ఎంత మాటండి.... ఇది మేకల కత్తండి....

పై : మేకల్ని మడుసుల్ని సమానంగానే పొడవొచ్చు.... కాదురా నాగన్నా!

నా : (త్రుళ్ళిపడి) ఆఁ....ఆఁ....

పై : గొంతుకలో ఏటి పడిందిరా....ఏం పకీరు.... ఓయ్ శీనయ్యా....అంతా బెల్లం కొట్టిన రాళ్ళలా అలాఉండి పోనారేటి? నోరిప్పి మాటాడండెహే....

ప : శీనయ్యగారు....

పై : డబ్బిత్తానన్నాడా.... ఆ మాటిని నువ్వు గడ్డి తిన్నా వన్నమాట....ఎంతిత్తానన్నాడు?

శీ : అయ్యా వాడితో ఏమిటి చెప్పండి.

పై : నువ్వు సెటప్పావసే....ఏం పకీరు

ప : యాభై యండి.

పై : నే నరవై యిత్తానుగాని....శీనయ్యను పొడిసేత్తావా? ఇంకో పదిత్తాను ఈ నాగన్నగాడ్ని.... (శీనయ్య, నాగన్న భయంతో కుప్పిగెంతు లేస్తారు) ఏటెహే నిప్పుతొక్కిన కోతుల్లాగెంతుతారు .... ఏం పకీరు

శీ : అయ్యా వాడితో నన్నెందుకు కలుపుతారు- అసలే వాడు తాగున్నాడు.

ప : ఏమయ్యోయ్ ఆబద్ధం ఆడితే....

పై : (కులుకుతూ) పొడిసిపారేత్తావా....

ప : (పోలీసునిచూసి) అబ్బే....

పో : ఓరి పకీరు రేపు ఇన్స్పెక్టరుగారు క్యాంపు కొత్తన్నారు ....కోళ్లకోసే పనుందిగాని ఆ కత్తి అక్కడపెట్టు

ప : అది కాదండి.

పో : ముందా కత్తి పెసిడెంటుగారి కాళ్ళకాడెట్టి బుద్ది గడ్డి తిందని లెంపలేసుకో.... లేకపోతే వందేళ్లు....

(పకీరు ఆ మాటవిని టపీమని కత్తి పైడిరాజు కాళ్ళదగ్గరపెట్టి లెంపలేసుకొని తోక ముడుస్తాడు)

అ : పోలీసుగారు రాబట్టి (అంటూ దగ్గరకు రాబోతే అప్పలస్వామి దూరంగా జరుగుతాడు)

నా : అయ్యగారి ధైర్నం మొదట్నుంచి నా కెరికేనండి....

శీ : అక్కడికి నాకే తెలియదంటావు

అ : మా బావగారి తీరే వేరు....

నాగ: మీరాగండెహే....ఏమయ్యోయ్ ఆ బల్లమీదకూకో.

పై : ఎందుకే !

నాగ: ముందు కూకోమంటుంటే.... నాగన్నా ఆ ఆరతి పళ్లెం అందుకో.

పై : ఆగాగు.... పోలీసు బల్లెక్కు....బామ్మర్ది పోలీసును బల్లెక్కించు (ఆమాటవిని అనంతం దగ్గరకు రాబోతే పోలీసు టపీమని బల్లమీద కూర్చుంటాడు)

నాగ: ఏమయ్యోయ్ నిన్ను కూర్చోమంటే....

పై : నాకంటే గొప్పోడ్ని కూకోబెట్టానే - పకీరుగాడి పైత్యం వదలగొట్టిన అప్పలసామికి పట్టాలే ఆరతి

అ : అవును బావగారు....

పై : బామ్మర్ది ఆరతి పాటలేమన్నా వచ్చురా నీకు.

అ : వచ్చు బావగారు .... పాడమంటారా.... ఆ:....

నాగ: ఛీ. సిగ్గులేనోడా.... నోరు మూస్తావా లేదా!
ఏమయ్యోయ్ ఇప్పుడే సెపుతున్నాను –

పై : నేను ఇప్పుడే సెపుతున్నాను–నువ్వేం చెప్పినా యినవని.

నాగ: అదిగో....

పై : నువ్వు సెటప్పొసె.... ఓయ్ శీనయ్యా ఈ కాయితం అట్టుకుపోయి ఆ రామరాజుగాడి మొకాన్నికొట్టు.... ఓయ్ నేను కొట్టమన్నానని సెప్పు....ఇదిగో పన్లోపని [illegible] పని. ఆడికో అయిదు కోసెయ్యమన్నానని సెప్పు.

శీ : అయ్యా పిల్లలుగలవాడ్ని – చచ్చిపోతాను.

పై : పిల్లల పేర్జెప్పి బతికిపోయావు....ఎల్లు

శీ : (కాయితం అందుకొని) చూసావురా నాగన్నా పైడి రాజుగారంటే మహారాజుబిడ్డరా....

పై : సెటప్పొసే.... ఏటా కూత. – మా అయ్యా రాజా మా తాత రాజా! నేను టెంబరోన్ రైతుబిడ్డను. ....ఈ కత్తిమీదసాము నాకొద్దు. హాయిగా కుర్చీలో కూకొని వచ్చేపోయేవాళ్ళను పలకరిస్తూ దర్జాగా ఎలుగుతాను. నాకేటి.... పోలీసు ముందునడు.... రత్తంవా....నువ్వెనకాలేనడు....ముందడుగేస్తే ఊరు కోను....ఓరోరేయ్ నాగన్న ఈగండం గడిసిందిరా....

నా : అవునండి.... కోడిపెట్టని పోలేరమ్మకి....

పై : పోలేరమ్మకి కాదెహే....అప్పలసామి అత్తగారికి బలే ద్దువుగాని కేపట్టుకొచ్చి యింటికాడప్పజెప్పు— అదంతే ఇంక మాటాడకు. పోలీసు నడు.

(అప్పలస్వామి వెనక కదిలివెళుతుండగా తెర)